కిలకిలఁ బ్రాఁకి పూఁబొదలు చించి హళాహళిగాఁ ఫలావళుల్
జలజల రాల్చి వప్రమణిజాలము లూఁపుచు వానరుల్ దిగం
చలములు మ్రోయ రాయిడులు సల్పఁగ మారుతి పల్కె రామునిన్. 152
తే. దేవ ! సురసిద్ధసాధ్యసాధ్వీజనంబు, చెఱలు విడిపించి పుణ్యంబుఁ జేర్చికొనుట
రాజధర్మంబునకు శేఖరం బటన్న, నలరి విభుఁ డట్ల కావింపు మనిన నతఁడు. 153
చ. చెఱ జవరాండ్ర నెల్లఁ గపిసింహ మహా! విడిపించి పంచినన్
వెఱచి పరిగ్రహింప కలవేల్పులు రావణబాధ యొంచి యం
దఱు వియద్వీథినుండి తమ నారుల నుర్విగలూర దైత్యుఁ డి
త్తఱిఁ బడు రాముచే వలదు తథ్యము మంచు వధింప నయ్యెదన్. 154
సీ. ఊరఁబడి విడలి త్రేళ్లియుఁ గొంగఁ జూచుచు బెదరుచుఁ జను లేటికొదమ లనఁగ
భీమజాంగలిక పేటీ మోచనము గాంచి తలఁకుచుఁ జను పాపచెలువ లనఁగ
సముదీర్ణ పంజరస్థానంబు వెలువడి యటకుచుఁ జను ముద్దుచిలుక లనఁగ
వలలకుఁ జిక్కి వెల్వడి లేచి తెక్కలుఁ జాడించి చనునంచచాన లనఁగఁ
తే. వెఱల విడిపడి రామ జే జే యటంచుఁ, దవిలి మ్రొక్కుచుఁ దమయథాస్థానములకుఁ
జనిరి తడయక నలుగడల్ గనుచు దివిజ, గరుడగంధర్వకిన్నరకంజముఖులు. 155

## హనుమంతుఁడు రామునకు రావణువిహారస్థలంబులఁ దెల్పుట.

వ. తదనంతరంబున హనుమంతుం డవ్వసుంధరాధరాధిత్యకాతటంబులం గలపంక్తి
కంధర విహారస్థలవిశేషంబు లెఱింగింపం దొడంగె నివ్విధంబున. 156
సీ. ఇవి వేల్పుజవరాండ్ర నీడ్చి మానము దూలఁబుచ్చు సంకేతంపుఁబువ్వుటిరవు
లివి గుఱ్ఱపుమొగంబు టవురాణుఁబోఁడులఁ దెగి చెట్లఁ గట్టిన తెంకిపట్టు
లివి సిద్ధసాధ్యమానవతీవితానంబుఁ గెలఁచు కారాగృహకందరంబు
లివి చిల్వచెల్వల హ్రీభంగ మొనరించు జలపట్టు సెలయేటి చఱులజాడ
తే. లివి కనుంగొను మెడనెడ ధవునిఁ గూడి, క్రీడ గావించు మందోదరీపురంధ్రి
చరణపంకజలాక్షాంకసాక్షు లైన, నెలచలువ వెన్నెలబయళ్లు నృపవరేణ్య! 157
క. అని హనుమంతుఁడు రఘురా, మునికిఁ గిరిఁ గలవిశేషములు దెలుపు నెడం
గనఁబడియె వారి కీగతి, నొనరన్ దశకంఠనాశకోత్పాతంబుల్. 158
మ. తవిలెన్ రావణదాహసూచకగతిం దావాగ్ని దిక్పాళి రా
ఘవబాణార్చులు రాలు నింక నన లంకాగోపురోత్తుంగశృం
గవిటంకంబులఁ జౌకళించె నపు డుల్కల్ దైత్యవక్షంబు లి
ట్లిరిగో వ్రీలు ననన్ ఖదేశిమము లద్యోం గండపాషాణముల్. 159

ఉ. కించుదనంబులేక వలకేల నొకించుక యుప్పళింత గా
వించినఁ బంక్తివీను భయవిహ్వలసిద్ధవధూకరక్షల
త్కాంచనవల్లకీచయముగా నలబంగరుగట్టుబెట్టు ని
ష్పంచలనాస్మగీయభుజచండిమనుం బ్రతిగల్గ నేర్చునే. 168

క. దనుజకులపుంగవాకృతి, వినుముప్పదిమూఁడుకోట్లవేల్పులఁ దలమో
చిన కైలాసము నేఁచి, న్వనమూపున నెత్తఁ గఠినదర్పై తగు నాతన్. 169

తే. వెండియును నెత్తనామీఁద నెండికొండ, నించి నెలయేటినీటఁదోఁగించఁదొడఁగు
నపుడు వీరాభిషేక వ్రతార్థ మొదవు, పూర్ణకుంభంబు పోల్పఁ దెల్పుచుఁజెలఁగు.

ఉ. అంకుశభిన్నమై కుసితమై నను దాఁకి యురంబు దూర్చి వ
జ్రాంకునిదంతిదంతము లుదగ్రగతిం బెకలింప రాక యూ
తంకము నొందఁగా నిలిగి గప్పకలంబులు మోసు లెత్తఁ గీ
ర్త్యంకురలీల దాల్చు నిఁక నవ్వల నా కెదు రెవ్వ రయ్యెడన్ ? 171

ఉ. ఏమును శంక దెందమున నించుక యేనియు లేక గ్రుంతు సు
త్రామమదాంధసింధురమదం బొకసింహము చూడ్కి నింక లం
కామృగయావనాంతరము కంపున నొందొక చింత మాని యూ
రామమృగంబు నత్త్వ మనురజ్జువునం దుది గట్టివేయనే? 172

ఉ. చంచలనేత్ర సీత నిడఁ బోలదునే శుక ! యేమిగా నిరీ
క్షించితి నన్ను దృష్టియుటఁ జీకటిఁ జేసెనఁ బాదు మంచు రా
త్రించరపుంగవుం డలుక దిక్కులు మ్రోయఁ బ్రయాణభేరి వే
యించె సమస్తరాక్షసుల కింపొదవన్ బవరంపుఁదెంపునన్. 173

క. తద్వైరిభాంకృతి విని, యుద్భటు లవ్వీరవానరోత్తములు నర
స్వద్భంగాగ్భటి యునఁగనా, రిద్ధిన్యులు నగుల నార్చిరి రణోన్ముఖులై. 174

## రాముఁడు సువేల మెక్కి లంకం జూచుట.

తే. అపుడు రఘువీరుఁ డచలశృంగాగ్ర మెక్కి, చూచె గృహారత్నదీప్తిరింఛోళి గప్పి
యసురనాశంబు సూచించునది యనఁ బోలె, రూపు గనరాక యున్న లంకాపురంబు. 175

ఉ. లంక నగాగ్రలగ్న సకలంకమణీమయుఁ గాంచి యాత్మది
క్పంకరుహాక్షు లంజనము పట్టఁగఁ గంచము నిల్పి మీఁద వి
స్పంకవలంకునన్ వెలుఁగఁ బెట్టినదీపికగాఁ దలంచి ని
శ్శంకుఁడు రాఘవేశ్వరుఁడు సంతస మందఁదొడంగె నయ్యెడన్. 176

తే. లంకలోఁ గూడ నిజశృంగ మింక నిటఁకుఁ, దెందు వేగమె యని యప్పఁ బెండికొండ

శుకసారణులు రామసేనావిశేషములం దెల్పుట.

ఉ. దృక్త్రితయంబునం బొలుచు దేవుని కేరి నజేశుం లన్విభుల్
వక్త్రయౌ వాణియుం బొగడ వారలదీప్తి కపీంద్రులం జతు
ర్వక్త్రుఁడు నేర్పనే భుజగవర్యు వశంబె గణింప నైనింక నీ
వక్త్రమ పూర్వసంచితతపఃఫల మెట్లగునో యి దశాననా! 188

ఉ. చూడవు గాని రాఘవముఖాదులఁ బోల్పఁగరానికయ్యపుం
బ్రోడల భానుకోటిరుచిఁ బోల్చిన బల్విలుకాండ్రఁ జక్కరా
జోడు మొగంబువారల యశోధనులన్ బగదాయ చూడ్కికిన్
వేడుకగొల్పరే వినిన వీనులవిందులు గావె తత్కథల్? 189

క. ఇల నరులఁ దినెడుమనకుం, గలిగిరిగద యిప్పు డసురఘస్మరు లిఁక వా
రల నరవానరు లని మదిఁ, దలఁపకు మొకయప్పుడేని దనుజాధీశా! 190

శుకసారణులు వానరవీరుల నేర్పఱించి దెల్పుట.

క. అని శుకసారణు లాడిన, విని విస్మయ మంది వారివీరాకృతు లేఁ
గనుఁగొందుఁ గాక యని వే, చని రావణుఁ డెక్కె నొక్కసౌధాగ్రమునన్. 191

తే. నిలిచి చారుల రావించి యిలయుఁ దివియు, ముంచు కపివీరసేనల మించు గాంచి
వీరిలో ముఖ్యు లెవ్వార లేరి? రాముఁ, డతని యనుజన్ముఁ డెట్టివాఁ? డనుచుఁ బలుక.

సీ. కలితసుగ్రీవయై కడుఁ బ్రశస్తి వహించి హనుమదాత్తముఖవికాసమునఁ బొలిచి
ప్రకటరంభోరువైభవమునఁ బాటిల్లి కేసరిమధ్యయై కీర్తి గాంచి
స్ఫురితలీలాంగదభూషితయై మించి తగుగజగామిని యగుచు నలరి
ఘనచక్రజఘనయై ఖరిజాడ రంజిల్లి కార్ముకభ్రూభంగిఁ గరము మెఱసి
తే. కంటె దశకంఠ! యలరు నిక్ష్వాకువంశ, నృపునిముందర సాక్షాత్కరించు విజయ
లక్ష్మియునుబోలె భువనపూలంకషోగ్ర, విక్రమోదార వానరవీరసేన. 193

చ. గవయుఁడు వాఁడు వానివెనుకన్ గజుఁ డాతఁడు గంధమాదనుం
డవల నలుండు నీలుఁ డతఁ డాతరువాత సుషేణ భల్లుక
ప్రవరులు వారు వారియిరుపక్కియలన్ శరభాదియోధపుం
గవు లతఁ డంగదుం డఖిలగణ్యుఁడు వాలిసుతుండు రావణా! 194

క. ప్రతిలేనియట్టియప్రతి, హతమల్లులఁ బుట్టియున్నయగచరసైన్యం
బతిలోక మపారమద, భ్రతర మవాఙ్మనసగోచరము దనుజేంద్రా! 195

క. ఏవంవిధకపికోటికి, జీవాతువు సూర్యసుతుఁడు సీతాపతినే
నావల్లభుఁ డతనిం గుల, పావను సుగ్రీవుఁ జూడు పఙ్క్తిగ్రీవా! 196

చారులు పలికిగ్రాహితసం, చారులు మీ రన్యథాపచారులు దలఁపన్. 206

మ. అని సూఘూర్ణితనేత్రుఁడై దశముఖుం డల్కన్ శుకున్ సారణున్
గని వారిన్ గటుకద్వదాభిముఖుఁడై గద్దించి వధ్యుల్ గదా
యని యుత్తుంగనగావతీర్ణ మగుకాలాభ్రంబుచందంబునన్
దనుజాధీశుఁడు మేడ డిగ్గి యతిచింతాక్రాంతచిత్తంబునన్. 207

క. కుందుచుఁ జారుల మాటలు, గొందఱ వీడ్కొల్పి భానుకులవీరుల పెం
పుం దెంపును గపివీరుల, చందంబును దెలిసి తాల్మిఁ జని యలసుండై. 208

రావణునానతి విద్యుజ్జిహ్వుఁడు రామశిరము సీతకుఁ జూపుట.

క. కలఁగుచు విద్యుజ్జిహ్వునిఁ, బిలిచి మహీపుత్త్రి యాత్మ బెగ్గిల మాయా
బలమున రామునివిల్లుం, దలయును నిర్మించి చూపఁ దగు నని పలికెన్. 209

వ. వాఁడును దత్ప్రకారంబునం గావించి తెచ్చిన మెచ్చి యశోకవనికిం జేర్చిన. 210

సీత రామశిరముఁ జూచి దుఃఖించుట.

చ. అతఁ డపు డట్టు చేసి జనకాత్మజముందఱఁ దెచ్చి వైవ సా
సతియును భీతిఁ గాంచి రఘుచంద్రునిధన్వమునుశ్శిరంబు నీ
గతి నిటు లయ్యెనే! యని వగన్ బడి మూర్ఛిలి వ్రాలి యంతలో
దితిజునిమాయయౌ! యనుచుఁ దెప్పిరి ముప్పిరిగొన్నఖిన్నతన్. 211

చ. బొమగవసోయగంబు శ్రుతిభూషణలీలఁ జెలంగు నబ్జమి
త్రము లగుదీర్ఘనేత్రము లరాళతరాలకజాలకాంతిమం
జిమమును నవ్వుకెంబెదవి చెక్కులఁ జిందము లాడుచాకచ
క్యములును జూచి రాఘవముఖం బని సందియ మంది యాత్మలోన్. 212

చ. తలకొని యవ్వసిష్ఠపదతామరసంబులతావి గ్రోలి భూ
తలనుతకీర్తిసంపదకుఁ దాఁ దలకట్టును నైన భానువ
త్కులమున కెల్ల బెద్దతల గోత్రభిదాదుల పూజ గాంచి యా
తల మఱి సాటి లేనిదగదా! ధవ! నీతల యెంచు వేమఱున్. 213

ఉ. అంకతలంబుఁ జేర్చుకొని హా! యనుచుం దలవడ్డచోశ కా
ళ్ళింక సహింతునే? యని యొకించుక యూహ యొనర్చి యాజి సా
తంకము నొందునే దశరథక్షితిపాలునిముద్దుపట్టి ని
శ్శంక భుజాబలుండు ఖరసంహరుఁ? డంచుఁ దలంచుచుండఁగన్. 214

ఉ. కంటివె మత్ప్రతాపము జగంబులు మువ్వురుసం గలంతు నేఁ
గం టొనరించినం దృణము గాదె మనుష్యుఁడు రాముఁ! డింక లేఁ

క. మీఁదెఱుఁగవైతి రాఁగా, చ్ఛాదనమునఁ బ్రాణహరణశస్త్రి పరస్త్రీ
గాదె? పరస్త్రీమాత్రమె?, యాదేవి త్రిలోకమాత యసురాధీశా! 224

క. ఆదేవిఁ జూచి పోవుచుఁ, గాదా నిన్నెదిరి యొక్కకపి మును మనలం
కాదిప్రపద్రుమప్రా, సాదంబులు వాలవహ్నిఁ బడి గొనిపించెన్? 225

క. అటువంటివీరవానర, భటసింహు లపారబాహుబలసాహసవి
స్ఫుటతరరంహు లనంహులు, పటుకీర్తులు రామభద్రపరిసరవర్తుల్. 226

క. తెగఁ దగదు విచారింపక, పగరబలం బాత్మబలము బహుళము నల్పం
బగు నేని వైర ముడుగఁగ, నగుఁ గావున సీత నిచ్చు టర్హం బింకన్. 227

తే. బిట్టుగా వేల్పువెలయాలిఁ బట్టుగొనుచు, గొంటు మును వెండిమల యెత్తిఖండపరశు
నువిద నుడికించుపాతకం బొందుఁగాక, సీత నీపాలిమృత్యువుఁ గానయందగునె? 228

చ. ఇపుడు దలంపు విశ్వజనయిత్రిని జానకి నాదిలక్ష్మిఁగా
నృపతివిలాసశార్ఙ్గి యని నిక్క మెఱుంగుము రాఘవేశ్వరుం
గపిమిషభీషణాశనులఁగా వివరింపు తదీయశౌర్యప
ద్విపులచమూసమూహముల వేఱొకభావము మాని రావణా! 229

వ. అనిన విని దశముఖుండు రోషారుణముఖుండై యతని కిట్లనియె. 230

రావణుండు సుమాల్యవంతుఁ గోపించి పీడ్కొల్పుట.

ఉ. కించుఁదనంబుతో నొకనృకీటముఁ దెచ్చి ప్రతాపదీపితా
శాంచలుఁ డంచు శాత్రవజయావహబాహుపరాక్రమోదయుం
డంచు రమాంగనారమణుఁ డట్టిడ యంచుఁ బొరింబొరిం బ్రతి
ష్ఠించెదు నన్నునిం బ్రతిఘటింపఁగ నేర్తురె దేవదానవుల్? 231

క. దేవాసురభీకర మగు, నావిక్రమ మెఱుఁగ వీవు నను లీలావి
ర్భావవిధూతమదాంధ్రి, రావణు రావణు నెఱుఁగరా యెవ్వారున్? 232

ఉ. ధర్మము ధర్మ మంచు రిపుధర్మమె పేర్కొనెదీవు రాముఁడే
ధర్మి వధూవధం బెపుడు ధర్మమె? స్త్రీముఖరూపవిక్రియా
కర్మము ధర్మమే? గరళకంధరజీర్ణధనుర్విభేద మే
ధర్మము? వాలివంచననిధానవిహారము నొక్కధర్మమే? 233

శా. రంభాశాపము నాకు లక్ష్యమె? కపివ్రాతంబు మచ్చండదో
స్సంభస్ఫూర్తికి నడ్డమే? యకట! సీతాశోకమే తన్మహీ
శుంభద్రాజ్యసుఖంబు మాన్పునది, యిచ్చో స్వర్గపాతాళలో
కాంభోజాక్షులఁ బట్టనే బలిమి! హా! నేఁగి సంధిల్లనే! 234

చ. అన విని దేవ నీవు చనునంతకు వచ్చెని యేము చాలకుం
డినఁగద యింక గావలెపాం నిల్వను రాముఁ డనంగ నెంత వి
ల్లన నది యెంత యేవఁహిమ నంది నతం డిపు డొక్క మ్రోఁతయుంగ్
వినఁబడనే యటంచుఁ బగిపెట్టకు లింద్రజిదాదిదానవుల్. 270

క. అతనియనుజ్ఞను భేరీ, తతములు రణనూత్రఁ దెలుపఁ బఱిసించిరి త
ద్వితతాడితధారవ ము, ద్ధృతకరమై మ్రోసె భువనభోవ్యాపకమై. 271

సీ. కల్పాంతవాతూలకర్షనిర్ఘర్యదశరధినిర్ఘోషంబు శరణుచొచ్చి
సంవర్తశిఖిశిఖాచర్వ్యద్యూణ్శీర్వధరాలఘుధ్వానంబు కేలుమొగిచెఁ
బ్రళయాంతకగభీరగళనిఃనిర్భవశ్క్రినవాసరవంబు కనవుగఱిచెఁ
గాఁభ్రగణగర్భగోళనిర్యద్భ్నుభిసురనాదము బిడ్డపేరు పెట్టె
తే. నిష్ఠహానిస్వనమునకు నిదియ తప్పు, దన్నిదానిను దీని వెనుక నే యని సమస్త
లోకవాసులు నిశ్చేష్టులై కలంగఁ, బంక్తికంఠునిపురి మ్రోసెఁ బటహశతము. 272

వ. అంత. 273

## రామరావణసేనలు యుద్ధసన్నద్ధము లగుట.

సీ. అనికి మేడలు తోఁడు చనుచెంచునో పీగి కనఁ బొల్చు నున్నతస్యందనములు
ఖురధూళిశరధి గూర్కొన నోపునో యనఁ దగు సేనబంధంబు లగుగఱాలు
నవసరం బైనప్పు డంభోధి దాఁ జాఁ దనుపుకొండ లనంగఁ దనరుకరులు
నాలంకలో నున్న కాళరాత్రికిఁ గల కొమకులు దాఁ దోఁచు ఘోరభటులుఁ
ఆ. గలిసి యరుగు దేరఁ గాహళరావంబు, భటులరవము శంఖపటహనినద
మెనసి బలియ వెడలి యింద్రజిత్ప్రముఖులు, పోఁజు దీర్చి రొక్క బయల నపుడు.

ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున, బలిముఖాధిపతులు పన్ని నడువ
వెనుకఁ దాను గదలె వెన్నుబలంబయి, నూఱుకోట్లకపుల నుగ్గు లలమ. 275

క. ఇవ్వీఁకను నిరువాఁగును, జివ్వకుఁ దలపడియె నడిమిచిదు గిరియే లం
చవ్వనధిభాగయుంగళము, చివ్వన నాలంక ముంచఁ జేరె ననంగన్. 276

వ. అంత. 277

క. ఒకయెడఁ జెలు భోకయెడ నలు, భోకయెడ నళిదివగయొరవు నొకయెడ నెఱవుల్
ప్రకటింపుచు సకలాశా, నికురుంబంబునకు మేదినీరజ మెగసెన్. 278

సీ. సమరవిక్రమనాట్యసంవిధానాగ్రసైవథ్యమై కనుపట్టె భటుల మ్రోలఁ
దనబిడ్డఁ జెఱ నిడ్డగనుజు మ్రింగఁగ నుర్వి లాఁచెనో యనఁ దోఁచె లంకమీఁదఁ
బై ముద్దవాటుగాఁ బడఁ జొచ్చె మిన్నేట సిక్తమై యలశిలాసేతువీథి

## ఆశ్వాసాంతము.

మ. నరనాథాగ్రణి ! సారసింహపదచింతాలోల ! నిస్తంద్రధీ
 రరసాధీశ్వర ! నీతిశోవిదనుతప్రారంభ ! నూత్నాకృతి
 స్మర ! నేత్రస్థిరపద్మ ! శైర్జరమహీజఖ్యాతదాతృత్వమా
 నరుచిశ్రీధర ! సాగతారినృప ! నందన్మిత్ర ! నర్మోత్థితా ! 290

క. సతతసపాదబరీదా, దితురుష్కాధిపశరణ్యదివ్యాంఘ్రి సము
 న్నతకర్ణాటస్థాపన, చతురాళియరామరాజజామాతృమణీ ! 291

ఉత్సాహ.—
 అధ్వరావనవ్రతక్రియా ! ప్రచండదాన ! వి
 ద్యాధ్వనీన ! ధీనిధాన ! యష్టదిక్పృపాలహృ
 త్సాధ్వసప్రదప్రతాప ! చాపనైపుణీఖనీ !
 సాధ్వనీకహృద్యపద్యసత్యవాగ్విచక్షణా ! 292

గద్యము. ఇది శ్రీమదోంటిమెట్టరఘువీరశతకనిర్మాణకర్తజగదేకఖ్యాతిధుర్యాయ్యలరాజు తిప్పయమనీషిపర్వతాభిధానపౌత్రాక్కయార్యపుత్త్ర పరిశీలితసమిద్ధరామానుజమతసిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్యకటాక్షవీక్షాపాత్త్రహృదయపద్మాధిష్ఠితశ్రీరామభద్ర రామభద్రకవిప్రణీతంబైన రామాభ్యుదయమహాప్రబంధంబునందు సప్తమాశ్వాసము.

నరిగి యొకవేల్మి వ్రేల్చి కుండాంతరుదిత, దివ్యసన్నద్ధరథ మెక్కి తిరిగి వచ్చి. 9

వ. తత్క్షణంబ పొడగట్టి రామసౌమిత్రిసుగ్రీవప్రముఖులు వెఱఁగంద నదృశ్యుం డై గగనంబున మాయామేఘంబులు పన్నఁ జుక్కలవెలుంగు దోఁచదయ్యె నయ్యెడ రక్కసు లుక్కు మిగిలి యక్కటికిఁ బొటిం గనుచూపి యినుమడించి తూర్యనినదంబులు నట్టహాసంబులుఁ జెలంగం దఱిమి తాఁకిరి కపులును లోఁచవకలిమినీడం బోవక కూడందఱిమిగి రఘుపుంగవుండును దివ్యశరజ్వాలామాలికలచే రాకాసిమూఁకల తోడనకూడం జీకటితిట్టల నెసియం బెట్టఁ దొడంగినం గలంగంబడి తద్దానవానీకంబు సైరింపలేక చని గవని చొచ్చిన మచ్చరంబు పెచ్చు పెరిఁగి శాంబరీకాదంబినీతిరోహితుండయిన రావణసుతుండు. 10

క. శరములు గురియఁ దొడంగిన, నరనాథులు ప్లవగయూథనాథులుఁ గడు న
చ్చెరువొంది యిపుడు వాఁ డెటకేఁ, బుఱఁబడ నరిబలము మ్రోలఁ బొడగన మేదిన్.

వ. పయినుండి ఘోరనారాచంబులు పడుచున్నయవి రావణానుమతిం గాలమేఘంబులు గురియుం నిసువాలుంబిసుగులు గాఁపు గదా యనుటయుం విభీషణుండు. 12

క. మొదలఁ బొడకట్టి పోవఁడె, యదృశ్యుఁ డై యొక్క రథికుఁ డతఁ డగ్నివరో
న్మదుఁ డై వచ్చినరావణి, యిదె యిప్పుడు మింట డాఁగి యేయుం జొచ్చెన్. 13

చ. అన విని రాఘవుండు నిశితాస్త్రము లంబరవీథి కేయఁ దొ
ట్టినకుహనాపయోదముల టెక్కునఁ దాఁకి పడం దొడంగె నం
దున వెఱఁగంది రేఁ డతనితూపులు ద్రుంచుచు నుండె వాఁడునుం
జానిఁగి జానింగి యూ పడరుచో టెఱుఁగంబడనీక మాయలన్. 14

వ. గగనంబున నెల్లెడలం దాఁకి గర్జిల్లుచుం గఠినబాణంబులు గుప్పుచుం గపులకుం గాలంబు వచ్చె ననిపించుచుం దెంపు చేసి. 15

సీ. మెడకు మీఁగాలికిఁ బుడమికిఁ గొనసేయఁ బొగడదండలతోన వ్రాలియుండువారు
నలువుర నేపురఁ దల లంటఁ గొనసేయఁ దిక్కట్లతోడన తిరుగువారు
తొడలు వక్షంబులు దూరంగఁ గొనసేయ మూఁటిలెక్కలమాడ్కి మ్రొగ్గువారు
పైకళేబరములు బరులునోఁ గొనసేయ నెడకువతోడన మడియువారు

ఆ. నగుచుఁ దచ్ఛరముల నగచరప్రళయంబు, పెట్టె ననఁ బ్రసిద్ధపూజ్యుఁ డైన
యూథనాథుఁ డనక యొంటరికాఁ డన, కాకసమున కనుపు లప్పగింప. 16

వ. కనుంగొనుచుం గౌసల్యానందనుండు నేయుంనదిలేక వింటికొప్పున దాకేలునై చుకొని యయ్యంధకారంబులో నిలువంబడి వారెవ్వరు విభీషణా! నీవా? సుగ్రీవా! నీవా? నిశ్చిన్ని దాఁకెన్? జాంబవంతుం డున్నాఁడా? యంగదుండా! హనుమంతుండు

ఘాధావద్విశిఖుండు వచ్చె నసువుం జచ్చెన్ సురుస్స్వత్రబా
హాధాత్రీధర మూడలం బడిన రక్షస్స్వందనోపేతుఁడై. 49

క. ఆవార్త విన్నయప్పుడు, రావణుఁ డసురోపభీకరభ్రుకుటిముఖుం
డై వజ్రదంష్ట్రుఁ బంచిన, నే వచ్చె నశంకపార విభవబలముతోన్. 50

వ. ఇత్తెఱంగునం బురద్వారంబు నిర్గమించి మృత్యుముఖంబున వెడలివచ్చు చిచ్చుచందంబునం దోఁచి యవ్వజ్రదంష్ట్రుండు నిజబలంబులం గూర్చుకొని కపులం జుట్టుముట్టి చతురంగంబులం బట్టిసపరశ్వధప్రాసపాశకృపాణాదుల ముంచినం గొంకింపక యదలించి వానరవరులు శిలాపాదపాదులం జెండాడి గండడంచిన దానవసేనలు కనుకనిం బఱచిన నప్పుడు గంటిచి తరుచగవ్యూహంబు దెరలించికొని చారంబడి వజ్రదంష్ట్రుండు యూథాధిపాదుల నుఱికి వెంపర సంపరం బఱపి వెంపరలాడుచుం జంపుచున్నం గని యంగదుం డెదిరి యతనియరదంబుఁ గరంబులం బట్టి నేలంగొట్టినం బుట్టచెండు కరణి నెగసి ధరణికి లంఘించి యాదైత్యుండు. 51

తే. ఉగ్రకరఖడ్గ మెత్తి పైఁ గుఱుకనంగ, దుండు వాఁ డెత్తుకెడువుతోడి శేలు
పెనఁగిపట్టె మోచేతిపట్టునను విఱిచి, నసువు తెగవైచె వాని నాయడిదమునన. 52

క. అంత నకంపనుఁ డసురాంకఁ, డంతకసభుఁ డసురబృభునియనుమతి గని య
త్యంతరభసమున సేనా, సంతానము గొలువఁ బటుహాశంఖము లులియన్. 53

క. వెరికిఁ జనుదెంచె నపుడు, ప్పలభుక్కుల కన్యవన్యఫలభుక్కులకున్
గల నయ్యె నందుఁ బైకొని, గెలుపునఁ గపివీరు లొడ్డగిల దొరకొనినన్. 54

## అకంపనుఁ డాంజనేయుని చేఁ జచ్చుట.

పంచచామరము.—

అకంపనుండు తేరిపై శరానలంబు గ్రాలఁ గా
లకంఠదోశ్శిఖాకలీలలం గరంబు గ్రాల సా
యకప్రకాండకృత్తవానరాంగుఁడై వెలుంగఁ గా
ప్సుపూర్తిపట్టి ముట్టి వానిపుట్టి ముంచె గట్టులన్. 55

## ప్రహస్తాదులు వానరవీరులతో ఘోరముగఁ బోరి దోరుట.

వ. అంత. 56

క. అధయము పతి కొనఁగి వెసన్, ద్విభాగసేనాధిపతి యతిస్ఫురితబలుం
డుభయబలభయదభూతి, ప్రథతోడఁ బ్రహస్తుఁ డాత్మ బలములు గొలువన్. 57

వ. నిర్యాణనిస్సాణధ్వానంబులు మిన్నుముంచుకొని చనం దనవెంటం గుంభహనుండును మహానాదుండును నరాంతకుండునుం జనుదేర నుత్పాతంబులకు భీతిల్లక తనధాకకు నచ్చెరువంది రాఘవులు విభీషణుం బిలిచి యితండు రావణుండే యని యడుగునట్లుగాఁ ద్రోచి నడచినం దదీయసేనలుం గోపులు ముంచి వచ్చెం బ్లవంగ

క. బండికలు దన్ని పైఁబడి, గుండె లగలఁ బడనడుచుచుఁ గుద్దిన బాహా
దండములు పాఱఁ దాఁచియు, తండంబు పడెం బోరగిల గద్దం బద్రువంగన్. 105

క. పడి మూర్ఛిలి యొక్కింతక, తడవునకున్ లేచి మంతి కంఠంబల తిరిగి పడన్
బడఁబోయి నిలిచి పవనజుఁ, బిడికిటఁ బమూర్ఛిల్లఁ బొడిచి నిలిచె నీలున్. 106

నీలుండు రావణుతోఁ బోరుట.

వ. అంతం దగని మూర్ఛ నొందియున్న హనుమంతుండు మూర్ఛ దేఱి తనకన్న మున్ను తెలిసి సేవలు దీర్చుకొని జగడంబునకుం దిగురథనయస్త్రంబులం జూచుకొనియె నప్పటికి నీలుండు కయ్యం బందుకొని పెనంగ దనుజుం దనుజుం దఱిమి యుఱికి దొమ్మి సేయం దగవు గాదని చూచుచుండి రయ్యెడ రావణుండును. 107

క. అబ్బురపుటంపబోసున, నిబ్బరపుం గడకఁ గాయుడిపి నిలిపెన్ దలపై
గుబ్బలితో బొబ్బలతో, బెబ్బులివలె వచ్చునీలు భీకరాకృతిలున్. 108

ఉ. ఇట్టటు మొట్టనీక యసురేశ్వరుఁ డీగతి నడ్డపెట్టినం
బట్టిన గట్టువైచి యతిమాత్ర తనూకృతగాత్రుఁడై తనుం
జొట్టినయంపపెండె మొకపొప్పున వెల్వడి మేను వెంచి క
న్పట్టె ప్రభంజనప్రియనిపట్టి విశిఖ్ పడఁ గూలఁ వెట్టుదున్. 109

వ. గుప్పునం గనుప్పతి భయంకరుఁడై గుప్పించి. 110

క. పిడ మెఱుఁగు గొడుగు నొఱుకన్, మెడ ద్రొక్కుం గ్రిందనక్క మీఁద న్నిక్కన్
జడిముడి మండివడునొడువుల, పడ పెట్టుం దలలు మొట్టు దవడలు గొట్టున్. 111

క. ఆలో నాలోకించిన, వేలుపు లయ్యసుర చెవికి వినరా నారా!
నీలా నీ లావెంతయుం, మే లని యచ్చెరువుపడుచు మెచ్చిరి యతనిన్. 112

తే. అప్పు డమరారి మదిఁ గోప ముప్పతిల్ల, గిరిశర మేసెఁ గాలిపాకాలు మనుచు
నస్త్రశిఖినీలునకు విమోహాంబ యొసఁగెఁ, బగరపయుఁ గొడుకుపైఁ దగునె తండ్రి?

క. ఈలీల నీలుండు మూ, ర్ఛాలసుఁడై వ్రాలి లేచునంతటిలో నీ
రాలాపముఖరుఁడై రాఁ, గా లక్ష్మణుఁ డడ్డకొన్యెఁ గని మార్కొనుచున్. 114

ఆ. అపుడు మించి మించ నాడినమాటల, కెన్ని యక్షరంబు లన్ని శరము
లసురనొల్ల గ్రుచ్చె నతఁడు నయ్యమ్ములఁ, గొఱికి యుమిసి పెక్కుకోల లేసె. 115

వ. వెండియు నయ్యిరువురుం బరస్పరజయాభిలాషంబున. 116

క. మ్రోఁగుచుఁ దూపులు తూపుల, సాఁగుచు దుస్తరశరక్షతారుణవారిం
దోఁగుచు మూర్ఛాదశలం, దూఁగుచుఁ దేఁగుచు బెనంగ దొరకొని రాజిన్. 117

రావణుశక్తిచే లక్ష్మణుండు మూర్ఛిల్లుట.

ఉ. అత్తఱి లక్ష్మణుం డొకమహావిశిఖంబునఁ దూపుతోడ వాఁ

వ. ఇత్తెఱంగున నొత్తరంబై జగత్తులు తల్లడిల్ల నొత్తి వచ్చిన యత్తేరిత్రోవఁ గోసలేశ్వరకుమారుండు. 128

క. అభ్రంకషరథకపి చిత్రధ్వజంబుల వెలింగెఁ బ్రళయాంతక ఫా
లభ్రాజిష్ణుభ్రుకుటీ విభ్రమ ఘోరేయ మైనవిల్లుం దానున్. 129

మానిని.—

రావణుఁ డేసె శరంబుల ఘోరతరంబుల నేరి తరంబులునుం
గా వవి తాఁకినఁ దాశరథిం బెనఁగం బరికల్పము లల్పములం
బోవని పాటివి పావని విల్లులు వోవఁ జలింపఁ జితంబును గ్రొం
బూవులతోఁ బొడవై తగుఁ దానవపుంభవదండమునం బొలిచెన్. 130

సీ. దశరథాత్మజుఁడును ననదిట్టతత్తడి నెత్తుట జొత్తిల్లి నెఱకుగాఁడ
నేసుంట కలిగి కట్టెఱ్ఱ మాపులఁ జూచి యంబువీథియురుల విల్లుఱుకఁ బెట్టి
విశిఖంబు లేయ విద్విషదిషుత్రుటనంబు, లవి యమేయజ్వాల లలమఁ బోదివి
వగ ధన్వ మయ్యె గట్టిగ నిప్పు దన సవాహనసారథికముగా నరద మెరియఁ
తే. జేయ బూడిదప్రోవులై చిన్నవోయి, కానఁబడెఁ గంటె నిశ్శేషగళితతత్త
దళమకుటకాంచనద్రసధార లున్న, తనువుతో రిత్తకలలతో దనుజరాజు. 131

క. ఇలు కాలి నూల నిట్టక, నిలిచిన నిట్రాడు వోలె నిజరథ మటులం
బొలియ న్నిలఁబడి రాకా, సులజోఁ సుండుటకు నగుచుఁ జూచిరి వేల్పుల్. 132

వ. కౌసల్యాకుమారుండునుం బంక్తిముఖుని వీక్షించి. 133

## రాముఁడు యుద్ధశ్రాంతుఁడగు రావణుని లంకకుఁ బుచ్చుట.

క. ఎఱుకలు నఱికినఁ గొమ్ములు, విఱికినఁ బోలేనిగిరిని బెగడినకరి ని
త్తఱిఁ దలఁపించెదు తేజం, బఱి యింత యవస్థ వచ్చెనా నీ? కకటా! 134

చ. అదియునుఁగాక గంధకరియాకృతి కేపటిఁ బట్టి యొక్కటిం
గద కపిరాట్చమూకదళికావనవాటిఁ బెకల్చి యాడి తిం
తదడవుదాఁక దూఱటిలిసాఁడవు కయ్యము నేయ నెల్లి వ
చ్చెద విపు డేమి దప్పె? నిలు చేరి సుఖంబున నుండు నేఁటికిన్. 135

## లక్ష్మణుఁడు మూర్ఛఁ దేరుట.

వ. పుత్త్రమిత్త్రకళత్త్రాదులతో విభవానుభవంబున నున్న నిన్ను నీయధర్మంబె దరిద్రాక్రాంతుం గదా యని యానతిచ్చి తద్దయానిధి యతనిం బొమ్మని యనిచి హనుమదంసావతరణంబొనర్చి వేంచేసి యనుజునిం దేర్చినఁ బౌలస్త్యుండును నచట నుండక చనుచో వనచరులు తన్ను వెన్నుదగిలి దుమ్ముతోలించి చల్లువారును జప్పట్లఁ జఱచువారును నడ్డంబరిగి వెక్కిరించువారు నునై చేరి చేరి కేరి కేరి నవ్వ నందఱం జేవిసరులం జెదరం జేయుచుం బరాభవఖిన్నుండును దయాపన్నుండును నై వేఱొక్కతే రక్కెఁ బురంబు చొరంబఱచి తననగరివాకిట నరదంబు డిగ్గి యాత్తపరివృతుండై పోయి యేకాంత

ద్యంబు భవత్ప్రేషితులచేతఁ గొంత దీఱెఁ గడమఁ గపులు దీర్చెదరు తదీయ భుజా
పర్వతపాదపాదిపాతంబులచే లెస్స మేలు గాంచినపుడు నీకు నిర్బంధాపాది యైన
పగ మామకజఠరానలంబున జీర్ణం బయ్యె నని నమ్ము మమ్మలికంబు విడువు మని
పలికి యగ్రజానుజ్ఞాతుండై కదలి పురంబు వెడలివచ్చువానిం జూచి రఘువీరుండు
విభీషణుం బిలిచి వీఁ డెవ్వండు వియచ్చలయపటకుటీరంబునకుం జాలినయొంటి
కంబంబు వలె నున్నవాఁ డని పల్కిన దేవా! యితండు కుంభకర్ణుండు దశముఖుని
డాసినవాఁడు దీర్ఘదేహుండు పుట్టినప్పుడ పొట్టచిచ్చునకునై జగదఖిలజంతుక్షయం
బొనర్ప నేర్పడిన నెదుర్పడి పురుహూతుండు పవిప్రాయుధంబున వైవ నది
ఱొమ్మున నొడ్డి వమ్ముపోవం జేసి చౌదంతికొమ్ములు గుదుసులకు విఱిచి దానం గొని
వైచి యవ్వాసవుం దఱిమెఁ బ్రపంచపరితాపం బొనరించి బ్రహ్మశాపంబు గాంచె
దానం జేసి యితండు నిద్రించుట గాక నెల లాహారవిహారంబులు గాంచుటకు
దినద్వయంబునకునై యుండు నిన్నిద్రాళువు మితినిండక మేల్కన్నం జెడు నని యుం
బరమేష్ఠియై పలికినాఁడు నేఁడు బలాత్కారంబున లేపి పంచినం జనుదెంచినాఁడని
విభీషణుండు విన్నవింప విభుండు వెఱఁగంది చూచుచుండె నంత. 143

## కుంభకర్ణయుద్ధము.

సీ. కదియ ముట్టినకుంభకర్ణునిపైఁ గపుల్ సంపుల్లభూరిభూజములు వైవ
నతనివక్షఃపీఠి నవి చూర్ణమై మరందరసంబు జిగటయై విరులు నిలిచి
పూవుగట్టున గందవొడివోలెఁ బరిమళభరితమై నెఱయ వా రరిది యనుచు
గట్టెత్తి వైవ మోఁకాళ్ల మోఁచేతులఁ దుమురుగాఁ దట్టుచు దూఱి యతఁడు
ఆ. వైచుకొనఁగఁ జొచ్చె వదనబిలంబులో, నరక యొడిసి యొడిసి యూథపతులఁ
గాయభీరువులు దదీయకర్ణఘ్రాణ, వివరమార్గములను వెడల వెడల. 144

వ. ఇది గాదని యయ్యఖిలభీకరుండు దండుమీఁదం బడి పదిసూఱువేలు మొదలైన
లెక్కలతో నెక్కువతక్కువం జిక్కినకొలంది కపులం గరంబులం జమిరి పిసికి ముద్దలు
చేసి సవ్యాపసవ్యంబుల వైచుకొని మ్రింగం దొడంగిన మొంగలిమూఁకలు వెఱచఱచి
పఱచినం గని కనలి యనిలతనయాంగదగవయద్వివిదశరభశతబలిగజగవాక్షాదివృక్ష
చరశ్రేష్ఠులు భూయిష్ఠమాత్సర్యంబులం బైకి లంఘించిన జంఘాజానుజఘనభాగంబు
లను వీఁపుల మూపులం జాఁపుచేతులం జెవులం జెక్కుల ముక్కుమీఁదనుం గలయఁ
బ్రాఁకిన నతండు గొండొకపడి నిండువనంబు తోడికొండవోలి పదంపడి యొడలు
జాళించి తూలించినం జాలించక ముంచుకొని ముందఱం బిఱిందివంకను వలపలందావ
లంబోనీక పొదివిన నుఱికి పిడికిటం బొడిచియుం దిరిగి మోచేతులం గ్రమ్మియుం నొరగి
రొం రతన్నులు తన్నియుం నఱుచేతం బఱచియుఁ బెడచేతనడచియుం నందఱం దూఁగి

వ. అక్కులుంగవ ప్రక్కం జిక్కి మిక్కిన మర్కటులు రక్కసులు వెక్కండ్రు గల రది యట్లుండె నందిళ్లకొలందుల నుం దెగినయస్త్రాల్లు రెండు నతం డార్చియెత్తినం జిల్లు నం జిమ్మనగ్రోవులం బారుతీరున నెగయు రుధిరధార లూర్ధ్వలోకంబులం దడిపికొను చుం బోయె నప్పు డప్పుడమితేఁడు వీడందవాఁడితూపుల నతని కాళ్లు కత్తిరించి యు య్యుత్తరము నొత్తరముం గుఱుచపఱిచిన నవుడు గఱిచి హుంకారణభయంకరుం డై మ్రింగ నప్పళించు నద్దానవుం డను. 154

క. తొంటినడ గుంటుపడినం, బంటుతనము గుంటుపడక పరుషధ్వనితో
మింటికి నిమ్ముగ నంగిటి, గుంటదనుక నోరు దెఱచికొని నున్ముఖుఁ డై. 155

వ. జరిగి జరిగి గిరి గదలి వచ్చునట్టి వచ్చుచో నచ్చెరువంది పరేశరాజశర మతిం బోసి యారాకాసి జేనిగళంబునకుం బూన్చి తెగనిండఁ దిగిచి జగతీవల్లభుం డేసె నంత.

మహాస్రగ్ధర.—
తెగి తన్మస్తంబు దంష్ట్రాధిగతధగధగద్దీప్తలిప్తాభ్రమై వ
క్త్రగుహాగర్జావశేషోద్గగనచలితగంధర్వవిద్యాధరం బై
నగరప్రాకారకేళీనగశిఖరసరత్నస్ఫురచ్చంద్రశాలల్
పగులంగాఁ దాఁకికొంచుం బలుపడిఁ జని తత్ప్రాంతపాథోధిఁ గూలెన్.

క. నడు మొగ్గడె మదియం నతనిది, కడలిన్ సగము వడి యొకసగం బిలఁ బడ నం
దడవులఁ గొండలఁ గ్రోతుల, దుడుములఁ బెక్కుపరియె దుత్తుము రయ్యెన్.

వ. ఆత్తఱిం బరమానందభరితులై దివ్యులు దుందుభులు మ్రోయింపుచుం బుష్పవర్షం బులు గురియించి జయజయశబ్దంబులతో రఘువీరుం బ్రశంసించిరి తప్పిపోక కుందప్పి నిలిచిన తరుచరులు తలలువట్టి చూచుకొనిరి యంత నచ్చట రావణుండు నిజానుజవధ ప్రకారంబు హతశేషనిశాచరులు దెలుపక తొలుతనె యతనితల వీటికిం దాఁటి పోవుటచేత నెఱింగినియుం. 159

## రావణుఁడు కుంభకర్ణుమరణమునకు శోకించుట.

క. వినమిన్ విచికిత్సాయుత, మనస్కుఁ డై యుండి యుండి మఱి వెనుకం దా
వినియున్ విచికిత్సాయుత, మనస్కుఁ డై యుండె నురక మ్రాన్పాటొదవన్. 160

వ. వెండియు నతండు తమ్మునిం దలంచి తలంచి యెలుంగెత్తి పిలుచుచుం దజ్జయంబు లుగ్గడింపుచు హా! యనుచు నేలం బుసుసుచుఁ బొరలుచుఁ బెక్కువగలం బలవించు చుఁ దనతోడం గూడఁ బుత్రమిత్రకళత్రాదు లడలి యడలితమం తన తాలిమిఁ జెచ్చు కొని తనుం దెలుపం జొచ్చినం దెలి నేరక యూరక పొగులుచు విభీషణు నీతి వినక చెడి తింగా యనియుం బుద్ధిచెప్పిన ప్రహస్తుని ప్రాణంబులు గొంటింగా యనియుఁ గడపట నీలావు నమ్మితిఁ గా తమ్ముఁడా! యనియుం దాపోవుచున్నం జేర వచ్చి త్రిశిరుండు

లక్ష్మణుఁ డింద్రజిత్తు వధించుట.

మ. అతఁడుం బోయి నికుంభిలాటవిని హోమారంభకుం డైనఁ దత్
హుతభుక్సన్నిధి ముట్టఁ బట్టుకొని యూర్పుల్ పట్టి యయ్యింద్రజి
ద్దితిజుం బోనీక జీరి చంపి మరలెన్ దేవేంద్రుఁ డుప్పొంగ న
క్షత శైల్ల న్వని పంక్తిఁ గాంచు: దదలల్కాం బంచి సద్వేలుఁ ద్దై. 182

రావణుఁడు మరల యుద్ధమున కేతెంచుట.

చ. వెరుక నృపాలురం గపులవేలముఁ బోద్చి వధింతు మున్న యా
జ్జనకజఁ ద్రుంతుఁ గాక దిమె చంపె ననేకుల నం చశోకకా
ననమున కై కఠోరగమనంబునఁ బోవ సుపార్శ్వుఁ డాదిగా
ననుఁ గులు మాన్పఁగా మరలి యాజికి వెల్వడెఁ బెక్కుఁటివులన్. 183

తే. వెడలి యసురాధినాథుండు గొనుకతోన, తెగనాడ దీమసం బనఁ దేరు డిగ్గి
యెల్లపరివారమునకుఁ జేయెత్తి మ్రొక్కి, నడుపుఁ డీవేళ యిది సుండిసాతు మీరు.

మ. అనిన న్మంత్రులు నాప్తులున్ దొరలు దేవా! మ్రాకులన్ రాలఁ జే
రనె యింతే నలవడ్డయోనిమిత కాంద్రన్ భానుపుత్త్రాదులన్
వినుమీ చంపక పట్టి తెచ్చి దినము న్నీయింటి కామాట పుం
బనికిం జొచ్చెద మన్న దాఁక నిడ చెంపల్ ప్రేతు నుద్యద్ధతిన్. 185

వ. మీరు తేరక యిటు విచ్చేసి కనుంగొనుం డనవుడు నుత్సాహంబుతో నతం డట్ట యాచరించె నద్దానవవీరులును భీకరాకారులై తేరులు వారణంబులు వారువంబులు ఘోరమృగంబులుం దమకు వాహనంబులు గాఁ గొని నానావిధతూర్యంబులు మ్రోయఁదలకడచి నడచినం గపిసేనలుం గలియఁబడియె నప్పుడు. 186

చ. శిలలను గుప్పచప్పుడును జేతుల పేశులు త్రిప్పచప్పుడున్
దెలుపుడు దెల్పుచప్పుడును దేరులు నూరెల రొప్పచప్పుడుం
బలములఁ ద్రిప్పచప్పుడులు బర్వఁగ నజ్జగడంబు మజ్జగం
బులు వినియెన్ నిశాచరచమూజితు లైరి ప్లవంగసైనికుల్. 187

క. విఱిగినకపులం గనుఁగొని, వెఱవకుఁ డని విల్లు పూని విభుఁ డిది యనికిన్
దఱి యని గంధర్వాస్త్రం, బఱిమిఱి నరిఁబోసి యేసె నసురులమీఁదన్. 188

వ. ఏసిన నద్దివ్యాస్త్రమహిమంబున. 189

సీ. ముంగల వెనుకవంకం గెలంకుల నిండి తోడిగినమ్ములతోన కడిఁదివిండ్లు
తెగలు నిండారంగఁ దిగిచి ప్రత్యాలీఢ పాదులై తముఁ జుట్టు వాఱుకొనుచు

లందు సూర్యాస్తమయంబు గావచ్చె నింక నోషధులు వెలింగి కనుపట్టునని పల్కు
పల్కులు కడనుండి విని యాంజనేయుండు. 200

క. ఇనుఁ డస్తమింపఁ జయ్యనఁ, జని యౌషధనగముఁ దెచ్చి సౌమిత్రి సజీ
వుని జేసి కొండ మును పుం, డినచోటనె డించి వచ్చె నృపుఁడు మెచ్చ౯? 201

ఉ. కోమలధాముఁడై పొసఁగఁ గొండ కినుండు కిరీటు వారెయ్య సు
త్రాముఁడు పెట్టిపంచినరథంబున రాముఁడు దేఱి త్తై సం
గ్రామము గోరి సన్నహనగర్వముతోఁ బురి నిర్గమింప భే
రీముఖతూర్యఘోషబధిరీభవదాశుఁడు రాక్షసేశుఁడు౯. 202

## రామ రావణ యుద్ధము.

వ. అప్పుడు సంగరదిదృక్షం జనుదెంచి యంబరంబునం బట్టు చాలక తొట్టియున్న కిన్నర
కింపురుష గంధర్వ సిద్ధ విద్యాధర చారణ సుర గరుడ సందోహంబు సన్నాహ
సాహసముత్సాహాభిరామముఖుం డై రాము నెదుర్కొనం బోవు రావణుం గలశా
శనమునికిం గరంబులం జూపి. 203

భుజంగప్రయాతము.—

త్రిలోకీవనీసంచరిష్ణుం ద్రికూటా
ద్రిలంకాగుహాకేసరి౯ వీనిఁ జంప౯
వెలుంగొందె మున్నిటి వేడెంబులోన౯
బళీ! రాముఁ డంచుం బ్రభావంబు లెంచు౯. 204

ఉ. ఆదశకంఠుఁడుం దెలివి నంతట సారథిఁ జూచి కుంభక
ర్ణాదులు దోడులేమి కెటు లయ్యెడునో యను చింత మానుమీ
యేదొర తోడువట్టి యెదురెత్తఁగ నెత్తితి వెండికొండ నా
కీదుర మెంత? నీవెఱవు లేమఱి కెక్కు మటంచుఁ జేరఁగ౯. 205

చ. మనుకులసార్వభౌమునకు మాతలి చేతులు మోడ్చి దేవ! యి
ద్దనుజునివింటిచేయి బెడిదంబునుమీ జతనంబు సూరెలం
గనుఁగొనుమయ్య! వానరులఁ గాల్చుచు వచ్చె శరంబు లొక్కరుం
డన వల దెంద ఱెంద ఱెదు రందఱకు౯ బరు వీతఁ డాజుల౯. 206

తే. పెక్కుడలఁ జూచి యొక్కఁగుడు నిక్కు మనిన, నగవు మొలక మొగంబున నిగుడు దేర
మాతలికిఁ బ్రత్యయకరంబు నాతనికి దు, రత్యయతరంబుఁ గాఁ గార్ముకారవంబు. 207

వ. రఘువీరుండు. 208

